# చతురాస్యము.

ఇది

రాజమహేంద్రవరము గవర్నమెంటుకాలేజీలో ప్రథమభాషాపండితులగు

కల్లూరి వేంకటరామశాస్త్రిలుగారిచే

రచియింపఁబడి

(1) వేపా విజయరామమూర్తి.

(2) దేవరకొండ జగన్నాథరావు.

(3) కర్రా రామమూర్తి.

(4) కంచుకూరి సత్యనారాయణ.

అను [illegible] క్లాసులోని ప్రియశిష్యులచేఁ బ్రకటింపఁబడినది.

మొదటికూర్పు 250 ప్రతులు.

రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1913.

[వెల 0—2—0.

# విషయసూచిక.





## శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 3 | బహూనసక్తి | బహూనసక్తి |
| 5 | 11 | అథ | అథ |
| 5 | 20 | ననువుచు | నుమువునో |
| 6 | 2 | బై వాక్యంబులు | బైశ్రితివాక్యంబులు |
| 6 | 24 | దినసంబు | దివసంబు |
| 7 | 17 | ింవ | ింప |
| 7 | 21 | కాలక్రిమంబున | గాలక్రిమంబున |
| 11 | 14 | నుచ్చరిసగా | నుచ్చరింపగా |
| 12 | 7 | మై వెలుగు | మైన వెలుగు |
| 12 | 7 | నిరసునాసికము | నిరనునాసికము |
| 12 | 12 | అభేకా | అభేదకా |
| 12 | 21 | గౌణధర్న | గౌణధర్మ |
| 12 | 22 | ముఖ్యధర్మము | ముఖ్యధర్మము |
| 13 | 12 | సంస్కృత | సంస్కృత |
| 15 | 6 | భీభత్సరము | భీభత్సరసము |
| 16 | 7 | అత్యుద్ధత | అత్యుద్ధత |
| 20 | 8 | ద్వితాద్యైది | దితాద్యైది |
| 21 | 14 | లీలామర్త్యాదులు | లీలావర్త్యాదులు |



# చతురాస్యము

——:(o):——

[చెన్నపట్టణముసందలి యాంధ్రపరిషన్మండలి కోరికను వ్రాయఁబడిన "షష్టోపని" యనువ్యాసము.]

ఆర్యాశ్లోకః॥ సుగురూ స్వగురూ వీరా।
వనాం నరసింహదీక్షితౌ ధ్యాత్వా।
చతురాస్యం కల్ప్యాస్యా।
స్వయవేంకటరామశాస్త్రిణా రచితమ్।

శ్రీపరిషత్సభ్యులయిన మహాకావ్యరసికశతానుస్యులారా !

విశ్రాంతిదివసంబు లగుటం జేసి పరదేశాంతరంబులకేగి వచ్చిన వెంటనే తమయొక్క సమాదరణపూర్వకసమాచారపత్రంబుఁ జూచుకొని సభాసభ్యాలికాలావధిక బంచషదివసంబులే యవకాశముండిన కారణమున నగమనో నుత్సాహంబు లేక మిక్కిలి ముకుళితప్రాయంబై పండితలోకబాంధవులగు తమలోకోపకారకమహోద్దేశప్రభావంబున మరలవికసించి నామనస్సాబ్జంబు చిరోత్రకభక్తిన్యాయంబున యథాశక్త్యోద్భవ నీమహాకార్యములో నన్ను బలాత్కరించుచున్నందున నీవిషయమయి నాయభిప్రాయంబును నిం మకవిన్నవించుచున్నాఁడను. అర్హమయిన యవకాశంబులేక సావధానచిత్తంబుతో వ్రాయమింజేసి యొకవేళఁ గొంతపాటవంబు లోటుపడినట్లు తోఁచినను, నావ్యాసంబును జూచి బండితమండలీసమ్ముఖం

బునకు నతిథిగా నావర్ణవలయునని తమ్ముమ వివిధంబుల విశ్వసించి కోరుచున్నాఁడను,

## గ్రామ్యభాషానిరసనము.

---

శ్లో॥ సాశ్లేషవిశేషచిత్రరచనాసామోదాత్త సమృద్ధకై!
ర్వ్యాఘూత్రవ్యతిరేకవక్త్ర రుచిమిత్రైర్నోర్వ్యద్వృష్టాంతకైః॥
ప్రత్యక్షాస్యసుకన్యకేన ఘటితైస్సమ్యగ్గుణో జృంభితై!
నిః ప్రత్యూహవిశేషాలంకృతిగణై రమ్యో రసో రాజతే॥

సాహిత్యరత్నాకరము.

ఉపమ. ఉత్ప్రేక్ష. మొదలగు నలంకారములును, మాధుర్యము, ఓజస్సు మొదలగు గుణములును గవివాక్యములయందు ఘటిల్లినయెడల రసమావిర్భవించి రాజిల్లుచుండు నని పై పద్యముయొక్క ఫలితార్థము. రసప్రవృత్తిగలదియే వాక్యమని చెప్పఁదగునుగాని రసహీనంబగుశబ్దజాలము వాక్యమునకు న్వర్థంబుగాదని "సావాగ్యా రసవ్యక్తిః" అను నాంధ్రశబ్దచింతామణియందలి ద్వితీయసూత్రము రసప్రాధాన్యము నుద్ఘోషించుచున్నది. శ్లో॥ గుణాలంకార రీతిస్పృహావికరో భావవిభవః—అనియు, శ్లో॥ రసోవాక్యార్థసర్వస్వం విలసతి పదార్థాః పురముఖా—అనియు, గుణాలంకార సంపదగల పదార్థసామగ్రియే విశిష్టరసోత్పత్తికి బ్రధానంబని ప్రతాపరుద్రీయప్రబంధకర్తయగువిద్యానాథపండితుండును వివరించుచుండెను. ఇట్లు తత్తద్రసోచితంబులగు వర్ణనంబుల పొందికతో నింపగుపదంబుల మేళనంబునఁ గావ్యంబునకు జీవితస్థానీయమయి బ్రహ్మానందప్రతిభటంబగు రసముదయించుచుండునని సర్వాలంకారికులును నైకకంఠ్యంబునఁ దమతమ తాత్పర్యంబులను జాటుచుండుట వీరలార వినుచున్నారము.

“శ్లో॥ మహాజనో యేన గతస్సపంథా” యను న్యాయంబున మహాజనులు సంచరించునదియే మార్గముగాని యన్యంబు మార్గంబుగాదని స్పష్టపడుచుండఁగా వర్తమానకాలంబున జనులకు సుసాధ్యంబయి లౌకికయాత్ర కుపయోగించుచుఁ బామరులను రంజించునట్టి గ్రామ్యభాషయేగ్రాహ్యభాషయనియు, ప్రబంధభాష ప్రతిబంధభాషయనియుఁ గొన్నివాక్యంబులు కర్ణగోచరంబులగుచున్నవి. గ్రామ్యభాష పామరులు సర్వదా వ్యవహరించునట్టి భాషగానున్నది. కాఁబట్టి యిట్టిభాషకుఁ బామరులే సర్వదా శరణంబు. పండితులు పామరులతోడి సంబంధదోషంబుననో, శాస్త్రీయభాష పామరులకుఁ దెలియకున్న కారణంబుననో గ్రామ్యభాష కొంత యుపయోగించుచున్నను గవితారచనాదిక్రియాకాలంబులయందు గ్రామ్యంబును దూరంబుగా నెంచి శాస్త్రీయంబగుభాషను నాదరించువారుగానున్నారు.

మనకాళ్లను వేళ్లను బట్టుచు దుమ్ము మొదలగునపరిశుద్ధపదార్థములు మన గృహములయందుఁ బరిచయంబుతో నున్నను సమయము వచ్చినప్పుడెల్లను వానిని సమ్మార్జనిన్తువు (చీపురు) తోఁదుడిచి దూరముగా విసర్జించుచున్నారముగదా! సస్యముతోఁ గలుపు మిక్కిలి బలిసి పెరుఁగుచున్నను దానిని బ్రయత్నపూర్వకముగాఁ బరిహరించుచున్నారము. పంకిలంబగు నుదకంబునఁ గతకరేణువునం బుపయోగించి పంకంబనుగంటించుచు నిర్మలోదకంబును గ్రహించునట్లు, లోకవ్యవహారదశయందునపశబ్దంబులు సుశబ్దంబులకంటెఁ బ్రజానురాగంబును సంపాదించి తలయెత్తికొని విచ్చలవిడిగాఁ బ్రవర్తిల్లుచున్నను, యుక్తసమయములందు శాస్త్రీయభాష నుపయోగించి వానినణఁగింపవలయునెకాని యెంతమాత్రము నుబెచ్చురేఁగునట్లు పురికొల్పఁగూడదు.

లోకమున సర్వజనులు నానందంబునకై ప్రయత్నింతురన్న సం

మానజ్ఞానులయి సఖ్యంబుల నొందుచుందురనియు నట్టివారి వాక్కుల యందే భద్రంబై లక్ష్మి నివసించుననియుఁ బై వాక్యంబులకు ఫలితార్థము. కాఁబట్టి యనేకగ్రంథప్రమాణంబులఁ బరిశీలించినను యుక్తియుక్తంబులగువాక్యంబుల విమర్శించినను శాస్త్రమర్యాదకు వెలుపులేని గ్రామ్యభాష రసాభాసంబునకుఁ బుట్టినిల్లయి గర్హణీయంబుగాని గౌరవయోగ్యంబుగాదని స్పష్టపడుచున్నది. నాటకంబులందు నీచపాత్రంబుల కుచితంబుగాన నీగ్రామ్యంబునకుఁ గావలసినంత యవకాశమిచ్చి యుత్తమపాత్రంబులయందుమాత్రము రిత్త సేయవలయును.

ఇంక నుత్తములు ప్రయోగించునట్టి సంభాషణంబునసే గ్రంథరచన చేయవలయునన్నయంశము గూడఁ గొంతచర్చించిచూతము. (శ్లో॥ శతేషుజాయతే శూరః॥ సహస్రేషుచపండితః' అనున్యాయంబునఁ బామరసంఖ్యకంటెఁ బండితసంఖ్య మిక్కిలి స్వల్పంబుగదా! పామరులతో సంబంధంబునంగాని, శాస్త్రీయముగా మాటాడినచోఁ బామరులు తెలిసికొనలేక నవ్వుదురన్న సిగ్గునంగాని పండితులును వ్యవహారమునందు నితరు లుపయోగించినంత గ్రామ్యంబు నుపయోగింపకున్నను మొత్తముమీఁద నపశబ్దంబులను సయితము క్రమభాగంబులో వాడుచుందురు. లోకవ్యవహారమునందు నొకవేళ వ్యాకరణయుక్తంబుగా మాటాడినను నట్టిమాటలు రసవంతంబయిన యొకయుత్తమ గ్రంథంబును రచించుటకు నెంతమాత్రమును జాలియుండవు. వ్యవహారావస్థలో మనకు వలసిన వస్తువులను వాడుకొనుటకు నవసరము దీర్చునట్టిమాటలు వ్యాకరణయుక్తముగ నుపయోగించినంతమాత్రముననే మనము ప్రాఁజదువులబ్రహ్మలమనిపించుకొందుమేని, మన గృహాధిష్ఠానదేవతలయిన స్త్రీలుసయితము కొంచెము వ్యాకరణాంశము మనకంటెఁ దక్కువగాఁగ నట్టి ద్రవ్యగుణక్రియలపేర్లను బ్రతిదినసంబున బ్రయోగించుచుందురుగాన వారునుగూడఁ జదువులనువ్వారే

దేవతలనియే చెప్పందగియుందురు. ఇట్లు ప్రతిగ్రహంబును బ్రహ్మణబ్రి హ్మలతో నిండారుచుండును. కావున, నిట్టి పెలపిండివంటిపేలవపుమా టలతో నిండినసీరసగ్రంథంబులను నాకర్ణించినవారు కావ్యరసామృతం బును గర్ణపుటంబులతోఁ జూఱలాడి జుఱ్ఱెనువిబుధాగ్రగణ్యులగుదురని యెన్నటికిని దలంపఁగూడదు. మనముత్తములనుకొన్నజనులు మాటాడు భాషగూడ గ్రాంథికశైలికి ననువుగా నుండనందున గురుకులవాసముచేసి సమార్జించినసుస్వరోకరుణాకటాక్షంబు ననుసరించియే గ్రంథంబులు రచి యింపవలయునని సిద్ధాంతమగుచున్నది.

అర్ధానుస్వారము.

---

అర్ధానుస్వారము తనకుముందున్నస్వరము (అచ్చు) ననునాసిక మని సూచించుటకు నిర్ణయింపఁబడినచిహ్నమయి యున్నది. సంస్కృత శబ్దంబులయందుఁగూడ «అభ్రి ఆఅఏ॥ఈ ఇతి।విద్వాల్లి ఖతి॥ సయ్యన్తా॥ ఇత్యాదిశబ్దంబులయందు నర్ధచంద్రాకార చిహ్నంబులు దేవనాగరగ్రం థంబులందు ననునాసికంబులగున యక్షరంబుల శిరంబులపయి వ్రాయఁబ డుచున్నవి. అనునాసికాక్షరము, సూ॥ముఖనాసికావచనో ను నాసికః॥ అ నుసూత్రప్రకారంబున ముఖనాసికంబుభయముయొక్క మేళనంబుతోనుచ్చ రింపఁబడునదిగాన నట్టి యక్షరముయొక్క నగముభాగ ముచ్చారణలో నాసికకుఁ జెందినదని పెద్దలు స్థూలదృష్టిని దానిని సూచించుటకై యర్ధ చంద్రాకారరేఖలను జిహ్నములుగా స్వీకరించి యుండవచ్చును. నాగర గ్రంథంబులయందు నక్షరంబులశిరంబులపయి నున్న యారేఖలే యను నాసికములయిన తెలుంగువర్ణంబులలో వానిపాన్నంబునకుఁ గాలక్రమం

బున జరిగియుండవచ్చును. అనునాసికాక్షరముయొక్క యుచ్చారణము ముఖంబునకును, నాసికకును సమభాగంబుగాఁ జెందునని సూచించుటకే కాక పెద్దలింకొకలాభంబునకై కూడఁ దెలుఁగువర్ణంబుల పార్శ్వంబులయందే యర్ధచంద్రరేఖలు వ్రాసియుందురు. హ్రస్వంబులయిన యనునాసికాక్షరములతరువాత వైకల్పికముగా నిండుసున్నలు వచ్చునుగాన మునుపు నిరూపింపఁబడినయరసున్నలే నిండుసున్నలగునని చదువరులకు సులభముగా బోధపడుటకై యట్లు గావించియుండవచ్చును. మన తెలుఁగుభాషలోఁ బార్శ్వమందును, సంస్కృతంబున వర్ణంబులశిరంబునందును వ్రాయుట సంప్రదాయంబుగా నున్నదిగదా!

తెలుంగుభాషయందువలెనే సంస్కృతభాషయందు సయితము వికల్పంబుగాఁగొన్నిశబ్దంబులందు ననునాసికవర్ణంబులపయిని నిండుసున్నలు వచ్చుట శాస్త్రీయముగావున నర్ధచంద్రరేఖలు పూర్ణానుస్వారములుండునట్టి యక్షరంబులశిరంబులపయినే వ్రాయఁబడుట పరంపరగా వచ్చుచున్నదియని తోఁచుచున్నది. అట్టి శబ్దంబులెవ్వియనఁగా (1) స స్మర్తా సంస్మర్తా (2) పు స్కోకిలః పుంస్కోకిలః (3) పు స్పుత్రః పుం స్పుత్రః (4) శా ర్ఙ్గశ్ఛింధి, శార్ఙ్గం శ్ఛింధి (5) చక్రిస్త్రాయస్వ; చక్రింస్త్రాయస్వ ఇత్యాదులందు|సూ॥అత్రానునాసికః పూర్వస్యతువా|సూ॥ అనునాసికాత్పరోనుస్వారః॥ అనుసూత్రంబులచే ననునాసికపూర్ణానుస్వారంబులు వికల్పంబున నగుచున్నవి యని పండితలోకంబునకు విశదమయిన విషయము. భాషయొక్కరీతి ననుసరించి తెలుంగులోఁ గొన్నిశబ్దంబులందే హ్రస్వంబు లనునాసికంబులై (అరసున్నగుఱుతులతోఁగూడినవియై)వికల్పంబుగా బూర్ణానుస్వారయుక్తంబులగుటయు, సంస్కృతంబులో పైనిఁజూపినట్టి రీతిని గొన్నిశబ్దంబులందు మాత్రమే యచ్చుల ననునాసికంబులై వికల్పంబుగా నిండుసున్నలగుటయు సంప్రదాయంబుగా నున్నయది. కాని

సంస్కృతంబున నింకొక విశేషంబు కలదు. శ్లో॥ "అయోగానునాసికా న
హకారా। నాదినోహకారః స్మృతాః। ఈషన్నాదాయణశ్చైవ। శ్వాసినస్తు ఖ
ఫాదయః।" అనుశిక్షావచనంబు నుదాహరించుచు 'నాదేతిసంవారఘో
షయోరుపలక్షణం। శ్వాసేతివివారా ఘోషయోః। సహేత్యుపలక్షణం
ఐచస్సర్వస్య ప్లుత ఇ కారస్యచానునాసికస్యా దర్శనాదిత్యలం॥' అని శబ్దే
ందుశేఖరంబున నాగేశపండితులు, అచ్పరిత్యాహారములోనివియైనందు
నఁ బ్రాప్తించినయానునాసిక్యధర్మంబును ప్లుత ఇ కారంబునకును రేఫ
హకారంబులకును, ఐ ఔ లకును, నిషేధించుచున్నారు. తెలుంగుభాష
లో నట్లుగాక, 'పైఁడి, పైఁట, సైఁపు, సైఁదము, ఔఁగాక, కౌఁగిలి,
కౌఁజు, ఇత్యాదులయందు ఐ కారమునకును ఔకారమునకును గూడ న
నునాసికత్వము కానిపించుచున్నది. అనఁగా నర్ధానుస్వారము లుండుచు
న్నవి. ఇంతియెకాక సంస్కృతంబునవలెనే తెలుఁగులో సయితము కొన్ని
శబ్దంబు లర్ధానుస్వారము నొందినప్పుడే (అనఁగా ననునాసికధర్మము కలిగి
యున్నప్పుడే) యుక్తమయిన యర్థంబు నిచ్చుచుండును గాని యట్లుకాని
చో విపరీతార్థమగుచుండును. "ఊఁ"। అనుశబ్దం బనునాసికమయినన
మయంబుననే ప్రశ్నంబును, కథయొక్క వినికిని, తెలుపుచున్నయది. లే
నిచో నిది యపార్థకంబగును. "అఁ, ఆఁ," అను శబ్దంబులందు నాకారము,
అనునాసికమయినపుడే 'అఁగు' మన్న యర్థము నిచ్చును గాని యదికాని
చో విపరీతార్థ మిచ్చును. నొంచు, వెలుఁగు, పెరుఁగు, పాఁడి, యిత్యాదులలో
నఁ బైవిజాతి రీతిని ననునాసికములయినపుడే క్రమముగా బాధించుట, కి
రణము, వర్ధిల్లుట, క్షీరసంపద, యను నర్థంబుల నిచ్చును గాని యట్లుకాని
చో వేఱొకయర్థంబుల నిచ్చును. మఱియు 'వచ్చెఁ గమలాక్షుఁడు, వె
చ్చెఁ దామరసాక్షుఁడు' ఇత్యాదిశబ్దద్వయసంధిస్థలంబులందును లోపించిన
నకారముయొక్క యానునాసిక్యమును సమీపస్థములయిన 'ఎ'కారములు
తెలుపుననియే యట్టిచోటను నర్ధానుస్వారములు వాగనుశాసనులచే వ్రా

కరణంబున విధింపఁబడినవి. అర్ధానుస్వారము తెలుంగునఁ దీసివేయఁబడ నేని లోపించినన కారముయొక్క యనునాసికధర్మమును సమీపస్థమయిన 'చ'కారము తెలుపకపోవలసి యుండును. మేమట్టి స్థలంబులయందు నయితము నాసికాసంబంధముతో నుచ్చరింపమని పట్టుదలతోఁ గొందఱుండురేని శాస్త్రమందు దయచేసిన వారు పలుకవలయునే కాని యట్లుకానిచో నెవరేమిసేయఁగలరు. "సయ్యన్తా; సవ్వత్సరః; పుల్లింగమ్: విద్వాల్లిఖతి" ఇత్యాదులందు ననునాసికములకు బదులుగా వచ్చినవి కాన నట్టిస్థలములయందలి యకార వకార లకారంబుల నాసికాసంబంధంబున నుచ్చరింప వలయునని శాస్త్రము బోధించుచున్నను నాయావర్ణంబులకు నానునాసిక్య ముచ్చారణ శక్తికిఁ గారణము గాన మేము తీసివేయుదుమనియుఁ బైస్థలంబులందు ముక్కుతోఁ గాక కేవలము ముఖంబుతోనే పలుకుదుమనియు నెవ్వరైనఁ బ్రబుద్ధులు వితండవాదంబునకు డీకొందురేని వారిముక్కును బలాత్కారముగాఁ బట్టి పల్కించుట యెవ్వరితరమగును? అనునాసిక్యము లేదనియు, అరసున్న లేదనియు వారే యెదుటివారి ముక్కును బట్టుకొని ప్రతిబంధింపఁ బ్రయత్నించుచున్నారు గదా! శాస్త్రవిశ్వాసము చేతను, లోపించినయనునాసికాక్షరంబులగుణంబును భాషాశైలిఁ జేసి యాదేశవర్ణంబులును సమీపస్థవర్ణంబులును దెలుపుట యుక్తంబగునన్న యుక్తిచేతను, మనస్సాక్షి బోధింపఁగాఁ బల్కవలసినదేగాని లేనియెడ నెవ్వరట్లు చేయింప సమర్థులగుదురు. అరసున్న (లేక) యానునాసిక్యము లేదనినవారి క్రిందిస్థలంబులయొద్ద నెట్టిసూత్రంబును బన్నుదురో యడుగుచున్నారము. బా. క్రి. సూ. 82. "ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగా నగు." ఉదా. తలఁపక; తీఁపక, తోఁపక; అరసున్నలు లేనివారి మతంబునందు నెట్టిచకారంబులకుఁ బకారము రావలసియుండునో యెట్టిచకారములకు ॥సూ॥ 88. ప్రికారముసవకారము రావలయునో తెలియక బుద్ధి డోలాయమానమగు

చుండును. అరసున్నయున్నయెడల 'ప్రతిజ్ఞాను నాసిక్యాః పాణినీయాః' అనున్యాయంబున శిష్యపరంపరాప్రవాహముగా వ్రాయఁబడుచున్నయర్థబిందుప్రకరువాతిచకారంబును దెలిసికొని సూత్రమును సులభముగా నుపయోగింతురు.

గీ. ధామకలితుండునై శూరతరుఁడగుః రుఁ।
డొప్పుసఁగురుచిరయశో మహోదయతను।

రాఘవపాండవీయము. ద్వితీ. 80. పద్యము.

ఇట భారతార్థమందు, సగురు చిర యశో మహోదయతఁ;సునమయిన చిరకీర్త్యతిశయములతోఁ గూడిన వాఁడవుటచేత; రామాయణార్థమందు, రుచిర యశో మహోదయతఁ, ఒప్పుసఁగుఁ అని వ్రాయఁబడినది. రామాయణార్థములోని యొసఁగుశబ్దములో నరసున్నయున్నందునను, భారతార్థములోని సాంస్కృతికసగురు శబ్దములో నరసున్న లేసందునను, బద్యపాఠసమయంబునఁ బరస్పరవిరుద్ధంబయిన యనునాసికత్వా ననుసికత్వధర్మంబు లొక్కమాఱుచ్చరింపఁగా శక్యంబులుగానందునను, నిట శ్లేషార్థమెట్లు పొసఁగునని యెవ్వరైన శంకింతురేని సావధానచిత్తంబుతో వినుండు. అరసున్న తనకుఁ బూర్వమందున్నయచ్చు, అనునాసికమయినట్లు గుఱుతని యీవఱలోఁ జెప్పియున్నాఁడను. కాఁబట్టి యొసఁగుశబ్దములోని 'అ'కారము నిత్యముగా ననునాసికముగాన ననునునాసికముకానేరదు. కాని సంస్కృతమయినసగురుశబ్దములోని 'అ'కారము, అనునాసికముగూడఁ గావచ్చును. ప్రమాణము. 'అ, ఇ, ఉ, ఋ ఏషాం వర్ణానాం ప్రత్యేకమష్టావశభేదాః' అని "ముఖనాసికావచ నోనునాసికః, అనుసూత్రము క్రింద వ్రాయఁబడినది. యత్నపూర్వకముగాసర్వదాయనునాసికము కావలయునని యుచ్చరింపఁబడినయచ్చు, అననునాసికము గానేరదు కాని సామాన్యముగా నుచ్చరింపఁబడిన యచ్చు, నుభయంబును గావచ్చునని సంస్కృతవ్యాకరణశాస్త్రమందుఁ బారిభాషికంబుగా మర్యాద సేయఁబడి

నది. కాఁబట్టి మెసఁగుశబ్దములోని సకారము సానునాసికమంబనను, సగు
రుశబ్దములోని సకారము నిరనునాసికముగానఁ బద్యపాఠసమయంబున
సకారము నిరనునాసికముగా నుచ్చరింపఁబడెనేని సానునాసికంబునకును
గ్రహణంబుగలిగి రామాయణభారతార్థంబు లుభయంబును బొసంగును.
ఇట్లు కిరణవాచకమైన వెలుఁగుశబ్దములోని లకారమునందున్న "ఉ" కా
రము సర్వదా యనునాసికముగాన ననునాసికము కానేరదు గాని, ఆచ్ఛా
దనవాచకమైన వెలుగుశబ్దములోని "ఉ"కారము నిరనునాసికమునందున
శాస్త్రింబున ననునాసికమునుగూడ గ్రహింపవచ్చును. కావుననే వెలుగు
మొదలగు శబ్దంబులకు నానార్థంబులుచెప్పిన నిఘంటుకారుల వాక్యంబును
సమంజసంబగుచున్నది. సామాన్యముగా నుచ్చరింపఁబడినవర్ణంబనునా
సికంబును గావచ్చుననుటకుఁ బరిభాషేందుశేఖరములోని నాటితొమ్మిదవ
పరిభాషలో నిట్లు వ్రాయఁబడియున్నది. "అభేదకాగుణాః। అసతియత్నే
స్వరూపేణోచ్చారితో గుణో భేదకో వివక్షితఇత్యర్థః"। గుణశబ్దముచేత
నుదాత్తానుదాత్తస్వరితములేకాక యానునాసిక్యముగూడ నర్థమగుననుటకు
"యథాత్పత్తీయాస్త్రధాంచమూ। ఆనునాసిక్యమేషాదక్యోగుణః" అను
పతంజలిభగవద్వాక్యంబు ప్రమాణంబుగా నున్నది. కావున నుపా
యాంతరంబులేమింజేసి పైనిం జూపిన సాంస్కృతికవ్యాకరణ సంకేతిత సం
ప్రదాయంబు ననుసరించి యర్ధబిందువులున్న శ్లేషస్థలంబులయందు నిట్లు
సవర్ణమగునని యుభయభాషానిరంకుశప్రౌఢయగాధపాండిత్యముగల
సూరకవీంద్రాదుల యభిప్రాయమగునట్లు స్పష్టమగుచున్నది. పైనిం జూ
పినభాష్యకారులవచనంబున నానునాసిక్యధర్మము గౌణధర్మముగాని
ముఖ్యధర్మంబుగాకుండుటఁ బద్యపఠనసమయంబున నట్టిధర్మంబును విమర్శ
సేయకున్నను శ్లేషార్థంబునకుఁ గొంత కలుగదనియే నాతాత్పర్యము.
ఇట్లు ప్రమాణంబులుచూపినను ననునాసికంబుల (అనఁగా నరసున్నల)
సంకేతింపనివారికి జలధారావస్థలోఁ గాక శాస్త్రీయావస్థలో నాసికతోఁ

బ్రయోజనంబులేనందున నది యున్నను లేనిదియైనవిద్యతేలసికా స్థితి యస్యాస్సా॥ అను వ్యుత్పత్త్యర్థమునుబట్టి నాసికాశబ్దంబు (లేనిది) మాత్రము తప్పతంబున సాధువయి యవయవంబు నిష్ఫలంబగుగాక !!

### శకటరేఫము.

---

సంస్కృతవ్యాకరణంబున వకారయకారములు మాత్రము లఘువులు, అలఘువులు, అని రెండువిధములుగా నున్నవి. లఘువనగా లఘుతరోచ్చారణ గలది యని యర్థము. 'యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యంసలఘూచ్చారణః' అని వ్యాకరణమునందు వివరింపఁబడినది. లఘూచ్చారణః॥ అనఁగా లఘుతరోచ్చారణమని శబ్దేందుశేఖరమందు స్పష్టపఱుపఁబడినది. నాలుకయొక్క చిట్టచివర, చివర, మధ్యప్రదేశము లప్రదేశములందును మిక్కిలి తేల్చి పలుకఁబడువర్ణము లఘువనఁబడును. ఇట్టివి సంస్కృతభాషలో యకారవకారములు మాత్రమే యున్నవి. ఆంధ్రవ్యాకరణకర్తలు యకారవకారములేకాక రేఫముగూడ లఘుత్వాలఘుత్వభేదముతో నున్నట్లు కనుఁగొనిరి. లఘురేఫము జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలములందు లఘుతరముగాఁ బలుకవలయునని యు, శకటరేఫము జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలములందు గౌరవముగా నుచ్చరింపవలయు ననియు, భేదంబు చెప్పుదురు. కనుక లఘురేఫము కోమలవర్ణముగా, నలఘురేఫంబు పరుషవర్ణంబుగాఁ బెద్దలు గ్రంథంబులందు లెక్కించిరి. శ్లో॥ జవర్ణాన్వర్జితాఃస్పర్శాస్సపవర్గాంత్య శేఖరాః। లఘురేఫణకారాచకోమలాఃపరికీర్తితాః॥ అని యహోబలపండితీయము. ఇట్లు లఘురేఫము కోమలవర్ణమగుటవలన శకటరేఫము పరుషవర్ణమని స్పష్టమగుచున్నది. లఘురేఫ మీక్రిందిశ్లోకములోఁ జెప్పఁబడినరీతిని హల్వర్ణములతో సంబంధించినప్పుడే పారుష్యమును బోధించునుగాని కేవలస్థితిలోఁ గోమలత్వమే.

జగుణముగాఁగలదనిరత్నాకరవ్యాఖ్యానము. శ్లో॥ రేఫేణయస్యకస్యాపి।యో
గోఽస్యకృతీయయోః।స్వోత్తరాభ్యాంతుల్యయో ర్వా।పరుషాష్టగణశ్శ్మపా॥
అని వర్ణాంతరంబులతో సంబంధించినప్పుడుగాని రేఫంబునకుఁ బరుషత్వగు
ణము రానేరదని చెప్పుచు, శ్లో॥ మాంసకీకససంకీర్ణాః ప్రసరద్రుధిరాపగాః।
వసాకర్దమితాయుద్ధేభూర్భ్రాంధ్రసుభద్రైః కృతాః' అను శ్లోకంబునం బరమం
బయిన బీభత్సరసమునకు రేఫసంయోగ ముదాహరణముగాఁ జూపఁబడినది.
శ్లో॥ అత్యద్భుతరసౌ రౌద్రబీభత్సౌ పరికీర్తితౌ॥ అని బీభత్సరసమత్యుద్ధతము
గావున నట్టిరసమును దెలియఁజేయుటకు రేఫసంయోగంబు నమంజసంబని
గ్రంథకర్త తాత్పర్యము. ఇట్లు సంయుక్తరేఫమును, అలఘురేఫం
బును పారుష్యగుణము గలవిగావున రౌద్రబీభత్సరసములకుఁ దగి
నవియనియు, కేవలరేఫంబు కోమలంబు గావున శృంగారాది సుకుమార
రసంబులయం దుపయోగింపఁ దగినదియనియుఁ బర్యవసానము తేలుచు
న్నది. "శ్లో॥ రసౌశృంగారబీభత్సౌ" అని శృంగారబీభత్సంబులకుఁ బరస్పర
విరోధంబు గనుక శృంగారరసంబులో నుపయోగింపఁదగిన లఘురేఫంబు
నకును బీభత్సరసంబులో నుపయోగింపఁ దగినయలఘురేఫంబునకును న
య్యారసంబులకుంబోలె మైత్రి చెల్లదని గ్రంథకర్తల తాత్పర్యము. కో
మలపరుషత్వంబులచే నన్యోన్యవిరోధంబుగలలఘురేఫశకటరేఫంబుల
కు యతిప్రాసములలో మైత్రి హాస్యాస్పదమని పెద్దలచే నిషేధింపఁబడినది.

హూణభాషలోఁగూడ నొక్కయక్షరమునే లఘురేఫంబునోలెఁ దే
లికగాను నలఘురేఫంబునోలెఁగఠినముగాను నుచ్చరించు సంప్రదాయంబు
కలదు. *e. g.* (1) **Right; Rigid** ఇత్యాది శబ్దంబులలో 'R'కుపరుషత్వ
ముగా నుచ్చరింపఁబడును. (2) **Here; ear; near;** ఇత్యాదిశబ్దంబు
లలో 'R' వర్ణము తేలికగాఁ బలుకఁబడును. హూణభాషలో నొకయక్ష
రమునే లఘుత్వగురుత్వములతో వాడుచుండఁగా తెలుగునం దవి సౌకర్య
మునకై రెండువర్ణంబులుగా నుచ్చారణభేదమును బట్టియే యేర్పఱుపఁ

బడినది. ఇట్టిభేదం బితరభాషలలోఁగూడ ననాదిగఁ జూపట్టుచున్నందున మనభాషలో నట్టిభేదంబును నిరాకరించుటకై నిరాకరంబయినయులఘుశ్రమంబు స్వీకరింపకుందురని విశ్వసించుచున్నాఁడను.

సంధి (4)

శ్లో. సంహితైకపదేనిత్యా । నిత్యాధాతూపసర్గయోః। ని
త్యాసమాసేవాక్యేతు।సావివక్షామపేక్షతే॥

అనువచనంబున సంస్కృతభాషలో వచనకావ్యమందు సంధి సంభాషకుని యిచ్ఛనుబట్టియున్నది. సంహితయున్నప్పుడే సంధికలుగును గాని వేఱొకయప్పుడు గలుగదు. సంహితయనఁగా నుచ్చారణలో వర్ణముల కత్యంతసాన్నిధ్యము 'సంహితానామ స్వభావసిద్ధార్ధమాత్రాతిరిక్త కాలవ్యవాయేన రాహిత్యం' అని వ్యాకరణశాస్త్రవ్యాఖ్యాతలు చెప్పినారు. అర్ధమాత్రకాలముకంటె వర్ణంబులమధ్యను నెక్కుడుకాలము వ్యవధానమయినప్పుడు సంహితలేదని వ్యాకరణవేత్తలు నిశ్చయించిరి. సంహితాశబ్దమును సంధిశబ్దమును నొకధాతువు ననుసరించియే పుట్టినవి గానఁ బాఠకుఁడు వాక్యము చదువునప్పుడు గుక్కయాపినచోటులనెల్ల నర్ధమాత్రాకాలముకంటె నెక్కుడయెడమున్నను గాన సంధియుండఁ గూడదు. శ్రోతలకు వాక్యముయొక్క యర్థము బాగుగఁదెలియుటకై తనయిచ్ఛవచ్చిన చోటులనెల్లను నాపుచు సంధిలేకుండఁ జదువవచ్చును. వచనంబులలోనివాక్యంబులకుమాత్ర మిట్టివిధి చెల్లదు. సర్వదా పద్యంబు సంధియుక్తంబుగానే యుండవలయు. పద్యంబులో సంధిలేకుండునేని పెద్దలచే నది యతిభంగమనునొక్కగొప్పదోషముగాఁ బరిగణింపఁబడియె. ఇట్టియాచారము చిరకాలమునుండియు రూఢమయియున్నది. ఉదాహరణముగా శంకరమండన మిశ్రులవివాదములోని శ్లోకం

బులు శంకరవిజయమునుండి యెత్తిచూపుచున్నాఁడను.

శ్లో॥ కర్మకాలే న సంభాష్య
అహంమూర్ఖేణ సంప్రతి
అహోపాప్రకటితం జ్ఞానం
యతిభంగేన భాషిణా

శ్లో॥ యతిభంగే ప్రివృత్తస్య
యతిభంగో నదోషభాక్
యతిభంగే ప్రివృత్తస్య
పంచమ్యాంతం సమస్యతాం॥ (8వ సర్గ, 27, 28, శ్లోకములు)

మండనమిశ్రులు మొదటిశ్లోకమునందు 'సంభాష్య—అహం' అని విసంధిగాఁ బలుకుటను విని యాచార్యులు దానిని యతిభంగదోష ముగానెంచి యాక్షేపింపఁగా మిశ్రులవారు తగినసమాధానము చెప్పలేక యతిభంగమందు ప్రివర్తించినందుకు శ్లోకములోనియతిభంగము దోష ముగాదని వక్రముగా నుత్తరము చెప్పిరి. కావునఁ బద్యగతంబైనవాక్యం బునందు సంధి తప్పక యుండవలయు.

## అన్యదేశ్యములు. (5)

శ్లో॥ 'ఇహాతుప్రివ్యాహార్యం। సంకేతితసుప్రిసిద్ధమేవ పదం' అను యాంధ్రిశబ్దచింతామణిసూత్రమువలనఁ బూర్వకవులు వాడినయన్య దేశ్యపదంబులనే గ్రహింపవలయును గాని తక్కినవి వాడఁగూడదు. అట్లు కాదేని 'యుపప్రియుక్తం కవిభిరప్రియుక్తం తదుచ్యతే' అనునాలం కారికసిద్ధాంతంబునఁ బూర్వకవులు వాడనియపూర్వపదమనవసరంబుగ నుపయోగింపఁ బడెనేని యప్రియుక్తమనెడిపదదోషము తటస్థించును.

కనుకనే 'యుద్ధేక్లేశగతః' అనినచోటను క్లేశపద మభినివేశార్థమందు యో గశాస్త్రమున వాడఁబడినదిగాని కవిప్రసిద్ధముగాదు గనుకఁ గూడదని ధర్మసూరి వక్కాణించె. దుశ్చ్యవనాదిశబ్దంబు లప్రసిద్ధంబులుగాన నుప యోగింపఁగూడదని విద్యానాథపండితుఁడును నిరాకరించె. ఒకవేళ మన పూర్వ తెలుంగనివస్తువు లనేకములు హూణరాజపరిపాలనమునందు మన ము చూచుచున్నారము గాన వానిని గవితారచనయందు నెట్లు వాడవల యునని యడుగుదుమేని వినుండు. మనకు సంస్కృతభాషను దెలుఁగులోఁ దత్సమమనెడిమిషచేఁ బ్రయోగింపవచ్చునని పెద్దలు సెలవిచ్చినందున నిట్టివస్తువులధర్మంబునుబట్టి సంగ్రహమయినసంస్కృతసమాసపదము లనుగాని తెలుఁగుపదములనుగాని రసవంతముగా నుండునట్టులు, పండిత కవులు పరిషత్తుచేసి కల్పించి ప్రకటించినచో నవియే వాడినకొలంది సు ప్రసిద్ధములై గ్రంథరచనకు నర్హంబులగునని తోఁచుచుండెడిని. అశక్య స్థలంబులందు నిట్లు చేయక తీరదు.

## శృంగారరసము. (6)

'శృంగమియర్తీతి శృంగారః' రసములలోఁ బ్రాధాన్యమును బొం దునదియని వ్యుత్పత్త్యర్థము 'శ్లో॥ వీరాద్భుతాదిషుచ నేషు రసప్రసిద్ధిః స్సిద్ధా కుతోపి వటయక్షవదావిభాతి। లోకే గతానుగతికత్వవశాదుపేతామేతాం నివర్తయితుమేష పరిశ్రమోనః" అనియు, 'శ్లో॥ శృంగారమేవ రసనాద్రస మామనామ' యనియు భోజమహారాజు తనశృంగారప్రకాశగ్రంథమందు శృంగారమే రసముగాని తక్కినవి ఘృతకోశాతకీ న్యాయంబున రసములు గా వాడఁబడుచున్నవియని యాక్షేపించెను. సకలకవులును శృంగారము రసముకాదని నిరాకరింపలేదుగాని తక్కినవి రసములని సమర్థించుటకు నె క్కుడుపరిశ్రమము నొందిరి. భోజమహారాజునకు శృంగారరసవర్ణనయం దు మిక్కిలి యభినివేశమున్నను నతనికి విద్యాభోజుఁడనియే ప్రసిద్ధివచ్చి నదిగాని శృంగారసమందలియభినివేశముఁబట్టి సత్ప్రవర్తన చెడి దుర్యశ

బు గలిగిన ప్లిచ్చటను వినియుండవుగదా! అయినను ప్రస్తుతకాలమును బట్టి పాకము ముదిరినశృంగారరసభాగంబులు విద్యాశాలలయందుఁబఠింప నిర్ణయించినచోఁ జదువు చెప్పునట్టిమహోపాధ్యాయులకు వివరించుటలో విద్యార్థిసంఘంబునెదుట విషమంబుగా నుండును గానఁ బరీక్షకు నిర్ణయింపఁదగినవికావు. పాండిత్య మబ్బినతరువాత విలాసమున గుప్తముగాఁజూడఁదగియుండుగ్రంథములని నాయభిప్రాయము. చూడకున్నను నయ్యది బ్రహ్మవిద్య కాదు కావున నావంతయేనియుఁ గొఱంతలేదు.

కార్యదర్శివర్యులార,

తమప్రకటించినసభానిర్ణీతికాలమునకు వ్యవధానము చాలమి నెంచి ప్రశ్నపంచకంబులో రెండింటికి మాత్రము విపులమయిన వ్యాసంబువ్రాసి, తక్కినవానిపైఁ గ్లుప్తముగా నాతోఁచిన యభిప్రాయంబును బ్రకటించినాఁడను గాన మన్నింపవలయును.

రాజమహేంద్రవరము. 11—5—1912.

కల్లూరి వేంకటరామశాస్త్రి
ఉభయభాషాధ్యాపకపండితుఁడు.
ఆర్ట్సుకాలేజి.



# సూక్తిబ్రహ్మణ్యసారసాక్షి

ఏకశబ్దంబు మొదలు నవాంతసంఖ్యాపదంబులకు సమాస
సాధుత్వసమర్థనము.

కల్లూరి వేంకటరామశాస్త్రి సమర్పితస్వాభిప్రాయము
శ్రీవేదమూర్తులయిన బ్రహ్మశ్రీ జంధ్యాల గౌరీనాథశాస్త్రులవారి
సమ్ముఖమునకు.

గీ॥ త్రిపథగయా ప్రపతంజలి! కైయట నాగేశపండితో క్తిరసైః॥
వాచా శ్లేషి వ్యాస, స్సూక్తిబ్రహ్మణ్యసారసాక్ష్యాఖ్యాః॥

శ్లో॥ శ్రుతివిశ్రుత జంధ్యాల! శ్రీగౌరీనాథశాస్త్రి వర్యకృతం!
ఏకాదినవాంతాంక! ద్వంద్వాదినిషేధ మండనం జీయాత్ ॥

పానః పురుషాగ్రణీ!! పండితగేయచూడామణీ! పారితోషికంబు
గానంపిన యేకాదినవాంతాంకద్వంద్వాదినిషేధ నిర్ణాయకంబనెడిపుస్త
కంబును సవిస్తరంబుగా సావధానమనస్కుండనై చదువంగాంచితిని. ఈ
కోశంబున సిద్ధాంతపక్షంబున నిరూపింపఁబడిననదుక్తులు పండితమండలికి
మూర్ధాభిషిక్తయుక్తులుగా స్ఫురింపక మానవు. పూర్వపక్షులెవ్వరో విశే
షించి పేర్కొనఁబడమింజేసి వారినామధేయ రూపధేయంబులు నామాన
సంబునకు గోచరంబులు గాకున్నయవి. పూర్వపక్షులు దురుద్ధరపూర్వప
క్షంబులనుకొన్న నారాయణాస్త్రంబులు వారిమొదలఁ బారాయణమాత్ర
ఫలకంబులే కావున పారాయణాస్త్రంబులని చెప్పనొప్పునుగాని నారా
యణాస్త్రంబులెంతమాత్రమును గానేరవు. అదియట్లుండఁగా నాయభిప్రా
యంబును వినఁగోరుచున్నాఁడను.

1 ఏకద్విత్రిచతుష్క్రమేణ గణనా మేషామివా స్తాంయతామ్॥ ఇత్యాద్యనర్ఘరాఘవ ప్రముఖగ్రంథంబులందు "ఏకద్వి" ఇత్యాదిస్థలంబుల, సూ॥ త్యదాదీని సర్వైర్నిత్యం॥ అను సూత్రంబున నేకశేషంబొదుకురాదే దని 87 పుటలో పూర్వపక్షులు శంకించుటం గాంచితి.

వారి తాత్పర్యంబిట్లని తోఁచెడిని.

పూర్వోక్తములయిన ప్రయోగంబులలోని త్రిశబ్దాదులు త్యదాదిభిన్నంబులు గాన నయ్యవి, త్యదాద్యంతర్గతములైన ద్వి శబ్దాదులతోఁ జార్థంబున మిళితంబులైనపుడు, నచ, దేవదత్తశ్చ తౌ॥ ఇత్యాదులందుఁ త్యదాద్యంతర్గతంబైన తచ్ఛబ్దంబుమాత్రము శేషించి యాశబ్దంబుమీఁద నున్నద్వివచనంబుచేత దేవదత్తశబ్దార్థంబును సహితము దెలిపినట్లు ప్రకృతంబునంగూడఁ బైప్రయోగములలోని 'ఏక' శబ్దముగాని 'ద్వి' శబ్దముగాని శేషించి తమమీఁదను బహువచన ప్రత్యయంబును బొంది లోపింపఁదగియున్నత్రిశబ్దాదులయర్థంబును నేల నుడువఁజాలవని ప్రశ్నార్థంబు కరతలామలకంబుగా స్పష్టపడుచున్నయది. మఱియు "ఏకద్వి" శబ్దంబులు చార్థంబున మిళితంబులైనచో, సూ॥ త్యదాదీనాం మిథస్సహోక్తౌయత్పరం తచ్ఛిష్యతే॥ అను శాస్త్రంబున ద్విశబ్దంబుమాత్రము శేషించి లోపింపవలసియుండిన యేకశబ్దార్థంబు నేలబోధింపనేరదనియు రెండవప్రశ్నార్థంబు ప్రకాశించుచున్నది. ఈరెండు పూర్వపక్షంబులకును నీవక్ష్యమాణంబైన త్యదాదిసూత్రస్థశేఖరంబే సమాధానంబు సమంజసంబుగాఁ దెలుపుచున్నయది॥ త్యదాద్యంతర్గతత్వేఽపి, ఏకద్వ్యోర్నైకశేషో నభిధానాత్; ధ్వనితంచేదం సరూపసూత్రభాష్యే। ద్వంద్వోప్యేతయోర్న। ఏకాదినవాంతానాంద్వంద్వాభావస్య చార్థే ఇతిసూత్రశేషే భాష్యే ధ్వనితత్వాత్ ఏవంచ "ఏకద్వికరణే హేతూ! మహాపాతకపంచకే। తృణవన్మన్యతేఽపి కామాయుః పంచకారయః" ఇతి నైషధపద్యే ఏకద్వికరణే ఇత్యసాధ్వేవ॥ పైనింజెప్పిన సూత్రశేఖరంబున నాగేశపండితులు సరూపసూ

త్రిభాష్యధ్వనివలనను, చాన్ద్రసూత్రభాష్యధ్వనివలనను, ఏకద్విప్రభృతులయినయంకంబులకుఁ గ్రమంబుగా నేకశేషంబును ద్వంద్వసమాసంబును "ప్రయుక్తానామనన్వాఖ్యానాత్" అనుభాష్యతాత్పర్యమువలన లోకప్రయోగప్రసిద్ధంబులు గావని స్థిరపఱుచుచున్నారు. 1 సమాససూత్రభాష్యధ్వని స్పష్టపడఁగా నీక్రిందను స్థాలీపులాకన్యాయంబుగాఁ గొంచెము వ్రాసి కనఁబఱుపఁబడును. ఏకద్వ్యాదిశబ్దంబులకు నేకశేషం బెందుకు రాదని శంకించుకొని "సంఖ్యాయా అసంప్రత్యయాదన్యపదార్థత్వాచ్చానేకశేషః। సంఖ్యాయా అర్థానాం ప్రత్యయాదేకశేషోనభవిష్యతి, నహ్యేకావిత్యనేనార్థోగమ్యతే। అన్యపదార్థత్వాచ్చ సంఖ్యాయా ఏకశేషోనభవిష్యతి" అని భాష్యము "ఏకశ్చ, ఏకశ్చ, ఏకౌ" అని యేకశేషంబుచేసినచో నట్టి ద్వివచనాంతమయిన యేకశబ్దంబు, లోకప్రయోగప్రసిద్ధిం జేసి యసహాయులనెడియప్రకృతార్థంబిచ్చునుగాని యిద్దఱనిన సంఖ్యార్థమెంతమాత్రంబును బోధింపఁజాలదనియు, ఇద్దఱనినయర్థంబు నిస్సందేహంబుగా బోధించుటకు ద్విశబ్దంబే కంకణంబుగట్టుకొని జాగరూకంబగుచున్నదియనియుఁ బూర్వోక్తభాష్యతాత్పర్యము. అనఁగాఁ బ్రకృతియైనయేకశబ్దం బేకత్వసంఖ్యను దెలుపుచుండఁగా నట్టి ప్రకృత్యర్థంబునకు ననువాదకంబయిన యేకవచనంబే యేకశబ్దంబుపయివచ్చుటన్యాయ్యంబుగాన బదార్థద్వయంబును బోధించుచుఁ బ్రకృత్యర్థవిరుద్ధంబయినద్వివచనప్రత్యయంబురాదని భాష్యతాత్పర్యము. ఇట్లే 'నాలుగ' నినయర్థమును ధారాళముగాఁ దెలుపునట్టి చతుశ్శబ్దంబు చాకచక్యంబుతో నివ్వటిల్లఁగా, చతుశ్శబ్దార్థమునందు "ద్వౌచ, ద్వౌచ" యని యేకశేషంబు గలిగించి ప్రకృత్యర్థంబైన ద్విత్వంబునకు విరుద్ధంబయిన బహువచనప్రత్యయమ్ముంచినచో నట్టి ద్విశబ్దంబు, ఏకశేషం బెందుకురాదని యడిగినవారలకు, సార్థకత్వంబును గలిగింపక యనర్థప్రదమగుననియు, భాష్యమం దుద్ఘోషింపఁబడినది. పైనిం జెప్పిన కారణంబులవలననే దశాంతశబ్దంబులవఱకు నుద్ద

ఘటంతంబులకు నేకశేషంబు గలుగనేరదు. కాని యిట్టి దుర్బలంబైన వచనంబులం గైకొని యొంతో గగనంబుగా నెంచుకొనుచు సంచరించువారికే వేఱొకరు పరిజ్ఞాతలు సాహాయ్యపడనందున నే కాతనంబు సంఘటిల్లి, యేకశేషత్వంబు రాకపోదని నమ్ముచున్నాఁడను.

2. చార్థేసూత్రభాష్యధ్వనియుం గూడ నెట్టులున్నదో కొంచెము విన్నవించుచున్నాఁడను. చార్థంబులలో నొకయర్థంబైన సమాహారంబునందు ద్వంద్వప్రకరణంబున భాష్యంబులోనిట్లు శంకాసమాధానంబులు వ్రాయఁబడియున్నవి. “ఏకాదశద్వాదశేతికోయంసమాసః। ఏకాదీనాందశాదిభిర్ద్వంద్వః। ఏకాదీనాందశాదిభిర్ద్వంద్వఇతిచేత్ వింశత్యాదిషువచనంప్రాప్నోతి।ఏకవింశతిఃద్వావింశతిః” అనిచెప్పచుఁ “అహేఽస్యైకవచనంతదానపుంసకలింగంప్రాప్నోతిలింగమశిష్యంలోకాశ్రయత్వాల్లింగస్య” అనియుపసంహరింపఁబడినది. పూర్వోక్తభాష్యంబున సమాహారప్రకరణంబులో నేకాదశద్వాదశశబ్దంబులెల్ల సాధువులని శంకించుకొనుటంబట్టి దశశబ్దంబుకంటెఁ గ్రిందనున్న యేకాదినవాంతసంఖ్యలకు నఖండసంఖ్యార్థమందు సమాహారద్వంద్వంబునిషిద్ధంబని ధ్వనించుచున్నది. నవాంతసంఖ్యలలోనే యట్టిసమాహారద్వంద్వంబుండెనేని “ప్రక్రమాతిక్రమణేకారణాభావాత్” అనున్యాయంబునకు వ్యతిరేకముగా నేకద్వ్యాదులను విడిచి యేకాదశద్వాదశాదిసంఖ్యాశబ్దపర్యంతానుధావనం బేల భాష్యకారులు చేసిరి? కావున నవాంతసంఖ్యలలో నొంటొంటికి నఖండసంఖ్యార్థమందు సమాహారద్వంద్వంబు లేదన్న భాష్యతాత్పర్యంబు నిశ్చితమగుచున్నది. అందులకుఁ గారణంబేమనఁగా “సంఖ్యాయా అక్షాసంప్రత్యయావస్థపదార్థత్వాచ్చానేకశేషః” అని యేకద్వ్యాదిశబ్దంబులకు నేకశేషవృత్తిని నిషేధించుటలోఁ జెప్పిన సరూపసూత్రభాష్యస్థయుక్తులే యీసమాహారద్వంద్వనిషేధంబునందును హేతువులగుచున్నవనియు నాబుద్ధికిఁ దోఁచెడిని. ఏకాదిశబ్దంబులకు నేకశేషవృత్తిచెప్పి యాశబ్దంబులపైఁ బ్రత్యర్థవిరు

ర్థంబగు ద్వివచనాదులుంచినను, ద్విశబ్దాదులవలన నట్టి ద్విత్వాద్యర్థసం
ఖ్యలు ఝుడితిస్ఫురించినట్లు స్ఫురింపక "ఏకా" ఇత్యాదులవలన, ననహా
యులన్నయపరిష్కృతార్థం బెట్టులుతోఁచునో; యట్లే పరిష్కృతంబునందు
నేకద్వ్యాదులకు సమాహారద్వంద్వంబు రచించినను, త్రిత్వాద్యఖండసంఖ్య
లను స్పష్టంబుగాఁ జెప్పుటకుఁ బ్రసిద్ధంబులైన త్రిశబ్దాదులు జాగరూకం
బులగుచుండ, నేకద్వ్యాదులకు నొసరించిన సమాహారద్వంద్వంబులవలనఁ
ద్రిత్వాద్యఖండార్థసంప్రత్యయంబు కలుగనేరక తాదృశసమాహారద్వంద్వ
ఘటకములైనను, నేకద్వ్యాదిశబ్దంబులు వేర్వేఱుగాఁ దమతమయర్థంబు
లమాత్రమును బోధించుటలో వినియోగించినందున స్వాభిధాశక్తి విర
మింపఁగా, నన్యోన్యసాహిత్యవిశిష్టసంఖ్యాబోధను (సంకలితార్థప్రతీతిని)
స్ఫురింపంజేయుంజాలవని భావ్యతాత్పర్యము. త్రిత్వాదిసంఖ్యార్థబోధము
నందు ననన్యసాధారణంబైనస్వాతంత్ర్యమ్ము వహించి రూఢంబులై
నిర్భయంబుగాఁ ద్రిశబ్దాదులు జగజ్జేగీయమానయశంబుతోఁ బరిఢవిల్లు
చుండఁగా, నట్టివానిముందట నెంతోకట్టుకట్టుకొని సమాహారాదిద్వంద్వం
బుల నొందివచ్చినను నేకద్వ్యాదిశబ్దంబులు తమలోఁ బ్రత్యేకముగా
నొకదానికిని లేనట్టి పరకీయశక్తిని నన్యోన్యసాహాయ్యంబునఁ దముకుఁ దె
చ్చిపెట్టుకొని లోకంబులో వ్యవహరించుటకు జంకి సిగ్గువడుంగాని, యట్టి
సమాసంబులలో నున్నయయ్యవే, వేర్వేఱుగా జన్మప్రభృతి దమకు జగ
ద్విదితంబైన స్వశక్తిని విడనాడక స్వార్థంబులు భిన్నభిన్నంబుగా వెల్లడిం
చుకొనుటలో నేమిప్రతిబంధము గలదు? కాఁబట్టి యేకాదశాదిశబ్దంబు
లకుఁ దక్కఁ దక్కిననవాంతిసంఖ్యలకు సమాహారంబు చెప్పినను, నఖండ
సంఖ్యార్థబోధము (నిరస్తావయవసంఖ్యాప్రతీతి) శబ్దశక్తిస్వభావంబునంజేసి
కలుగనేరదని భావ్యతాత్పర్యము. నియమంబు సజాతీయవిషయంబు సహి
ష్ణించునుగాన, ఏసమాహారాదిద్వంద్వంబులలో నేకాదిసంఖ్యలు దశా
సంఖ్యలతో సమసించినపుడు సంకలితసంఖ్యార్థబోధంబు నిచ్చునో, [illegible]

సమాహారద్వంద్వంబులలోనే యేకాదినవాంతసంఖ్యలు సమసించినప్పుడు సంకలితార్థంబు సీయఁజాలవని సంకలితసంఖ్యార్థంబు తత్రత్యభాష్యప్రకరణంబువలనంబట్టి నియమింపఁబడుచున్నది. కాని ద్వంద్వంబు నియమింపఁబడదు. సమాహారద్వంద్వంబులో ద్రవ్యంబులు విశేషణంబులును, సాహిత్యముప్రధానమునియు, ఇతరేతరద్వంద్వంబులో సాహిత్యము విశేషణమును ద్రవ్యంబులు ప్రధానములునియు, శాస్త్రమర్యాదననుసరించి యేకద్వ్యాదిశబ్దంబులకు సమాహారద్వంద్వంబు చెప్పినచో సాహిత్యప్రాధాన్యముచేసి సంకలితసంఖ్యాప్రతీతి తప్పక స్ఫురించుననియుఁ, గాన నట్టిస్థలంబులందు నితరేతరద్వంద్వంబే రచింపవలయుననియు నట్టిసంకలితసంఖ్యాప్రతీతికొఱకే "ఏకాదశ, ఏకవింశతిః" ఇత్యాదులందు సమాహారద్వంద్వంబు చెప్పిన భాష్యసారస్యమ్ము ధ్వనించుచున్నదియనియుఁ జెప్పటకు నవసరంబు కానిపించదు. ఏకాదశాదిశబ్దంబులలో నితరేతరద్వంద్వంబుసేయఁగా నిత్యబహువచనాంతదశశబ్దాంతసమాసంబులలో బాధలేకున్నను "ఏకవింశతిః" "ద్వావింశతిః" ఇత్యాదులందు నితరేతరద్వంద్వంబువలన, సమాసంబులో "ఏకవింశతీ" అని ద్వివచనాపత్తి కలుగునను కారణంబుననే సమాహారద్వంద్వంబు రచింపఁబడినదికాని సంకలనార్థప్రతీతికై కాదు. కావుననే చార్థేసూత్రభాష్యంబున నిట్లు వ్రాయఁబడినది. "ఏకాదీనాందశాదిభిర్ద్వంద్వ ఇతిచేద్వింశత్యాదిషు వచనప్రసంగఇతి; నైషదోషః, సర్వోహిద్వంద్వో విభాషైకవద్భవతి, తదాతహ్యేకవచనం తదానపుంసకలింగంప్రాప్నోతి, లింగమశిష్యం లోకాశ్రయత్వాల్లింగస్య" అని యుపసంహారింపఁబడినది. పై నిఁజూపఁబడిన చార్థేసూత్రభాష్యములో నేకవింశత్యాదులందు ద్వివచనాదులువచ్చి రూపమందు దోషంబు గలుగుననియు, కావున సమాహారద్వంద్వంబు రచింపఁబడెనేని లింగములోకాశ్రయమయినందున నపుంసకలింగముగాక స్త్రీలింగమే యుండవచ్చుననియుఁ భాష్యంబున జెప్పఁబడినదిగాని సంకలితార్థప్రతీతి కలుగనేరదని

యూపత్తి యూయఁబడలేదు. సమాహారద్వంద్వరచనవలన ముఖ్యంబుగా సంకలితసంఖ్యాబోధమే తోఁచునెడ నట్టిదోషోద్ఘాటనంబు సేయక యిట్టి సమాసంబుల నితరేతరద్వంద్వంబు నొప్పుకొనుచు వచనంబునంజేసి దోషమునచ్చునని యెట్లు రూపనిష్పత్తిదోషంబుమాత్రమె చూపఁబడినది? కాన, ఏకాదశశబ్దము మొదలుకొని అష్టాదశశబ్దంబువఱకు రూపనిష్పత్తిదోషంబు లేదందున సమాహారేతరేతరద్వంద్వంబులలో నేదియైనను జేయవచ్చుననియు,సంకలితార్థబోధంబు "ప్రియుక్తానామన్వాఖ్యానాత్" అనున్యాయంబున శబ్దశక్తిస్వభావంబుననే కలుగుననియు, భాష్యకైయటముల తాత్పర్యంబు చార్థసూత్రమునొద్దఁ గరతలామలకంబుగాఁ గానవచ్చుచున్నది. అందుననే ద్వ్యష్టనసూత్రశేఖరమున "ద్వావింశతిరితి, సమాహారద్వంద్వేస్త్రీత్వాలోకాత్, ఇతరేతరయోగస్తున, తత్సూత్రభాష్యే ఏవద్వ్యంతానభిధానాత్" అని యేకవింశతిద్వావింశత్యాదుల యందు నితరేతరయోగంబునకు ననభిధానమని చెప్పుచు నిట్టిశబ్దంబులకు సంకలితార్థబోధంబు శబ్దశక్తిస్వభావంబునఁ గలుగునని యభిప్రాయపడి "వస్తుతః సంఖ్యాంతరాణి నిరస్తావయవాన్యేవైకవింశత్యాదీని" అనితుట్టతుదను లిఖింపఁబడినది.కాఁబట్టి యేకద్వ్యాదిశబ్దంబులకుసంకలితసంఖ్యార్థమందుసమాహారేతరేతరద్వంద్వంబులకుననభిధానంబుగాని భిన్నార్థప్రతీతియం దిట్టిసమాసంబులు ఘంటాపథంబుగా నొప్పుచుండునని తోఁచుచున్నది. కాన సమాహారస్థలంబున సంకలితార్థకల్పనంబు సరసంబుగాఁ గానిపింపదు. మఱియు సిద్ధాంతకౌముదిలోనే ద్వ్యష్టనసూత్రమునొద్ద "ద్వౌచ, దశచ" అని సంకలితసంఖ్యార్థమందు నితరేతరద్వంద్వవిగ్రహంబు రచించి చూపఁబడినను, శేఖరకారులెత్తుకొని సంకలితార్థమందితరేతరయోగంబుగాదని యాక్షేపింపలేదు. సమాహారద్వంద్వస్థలంబున సంకలితార్థంబు తోఁచునన్నచో "భక్షోపాసహం ఫలిలి, శమీవృషదం పాప్నలి" ఇత్యాదిసమాసములకు నేవార్థంబునకు సంకలనము గలిగి విరుద్ధా

ర్థంబగును. ఈయర్థంబునే, సూ «స్వ్యైకయోర్ద్వివచనై కవచనే” అను సూత్రికారప్రియోగంబును «సరూపాణాం శేష ఏకవిభక్తావితియత్యుచ్య మానేద్విబహూన్వారపి శేషః ప్రసజ్యేత” అను సరూపసూత్రిస్థభాష్యప్రియో గాదులును దృఢపఱచుచున్నవి. భిన్నార్థస్థలంబున సంఖ్యావాచక పదం బులకు ద్వంద్వంబు నిర్వివాదంబుగా నుండవచ్చునందుకేని «శ్లో॥ ఏకద్వి కరణేహేతూ। మహాపాతకపంచకే। తృణవన్మస్య తేకోప। కామాయః పంచ కారయః॥ అను నైషధకావ్యమునందలి పద్యంబులోఁ గోపము ఏకకరణ మందు హేతువనియు, కామముద్వికరణమందు హేతువనియు, అనఁగా, ఒకబ్రహ్మహత్యనే చేయుటకుఁ గోపము కారణమనియు, సువర్ణస్తేయ గురుతల్పగమనములను రెండుమహాపాతకములను జేయుటకే కామము కారణమనియు, లోభ మైదుమహాపాతకములను జేయుటకుఁ గారణము గానఁ గోపకామములను దృణతుల్యముగా లోభము చూచునన్న పద్యా ర్థంబులో «కోపకామా” అను ద్వంద్వంబులో మొదటనున్నకోపము «ఏకద్వి” అను ద్వంద్వములో మొదటనున్నయేకశబ్దముతోను, తర్వాత నున్న కామము తర్వాతనున్న ద్విశబ్దంబులోను యథాసంఖ్యముగా భిన్న భిన్నపదార్థంబులతో నన్వయించినందున నిచ్చట సంకలితసంఖ్యాప్రతీతి లేదు కాఁబట్టి యేల నాగేశపండితు లీకవి ప్రయోగంబును నసాధువని యాక్షేపించెనో యుత్తరంబు చెప్పవలయునని శంకింతునేని సావధానచి త్తంబునఁ జిత్తగింపవలయును.

సమాధానము

«ఏకద్వి” అను ద్వంద్వంబులోనున్న «ఒకటి” «రెండు” అను సంఖ్యలతో «కోపకామా” అనుద్వంద్వంబులో నున్నరెండుపదార్థము లగుకోపకామములకుఁ గ్రమాన్వయము కుదురదని «ఆద్యంతౌట కితౌ” సూత్రిస్థభాష్యకైయటవివరణముల తాత్పర్యమై యున్నది. [illegible] నయ్యది యేకదేశంబుగా స్థాలీపులాకన్యాయంబున నుదాహరించు

చున్నాఁడను. "ఆద్యంతౌటకితౌ" సమాసనిర్దేశో౽యంత్రత్ర సఙ్జాయతే
క ఆదిః కో౽న్తఇతి తద్యథా—"అజావిధనౌ దేవదత్త యజ్ఞదత్తౌ" ఇత్యు
క్తేతత్రసఙ్జాయతే—కస్యాజాధనం, కస్యావయ ఇతి భాష్యం॥ యద్యపి
దేవదత్తస్య యజ్ఞదత్తస్య చాజా అవయశ్చధనమితివాక్యేపి క్రమవ్యవ
స్థా నాస్తితథాపిసమాసేసుతరాం నాస్తీతి ప్రతిపాదయితుం సమాసఇత్యు
క్తం, కైయటః॥ సుతరామితి, యత్రైవ సాహిత్యస్య నియమేనప్రతీతిః,
పృథగుపస్థితిశ్చ, తత్రాపిచేన్నక్రమవ్యవస్థా కిమువక్తవ్యం సాహిత్యప్రతీ
తావపృథగుపస్థితౌచేత్యర్థః, వివరణం॥ "దేవదత్తయజ్ఞదత్తులు అజావిధ
ధనులు" అన్న సమాసస్థలంబులో దేవదత్తయజ్ఞదత్తులిద్దఱిలో నెవరివి మేఁ
కలో యెవరివి గొఱ్ఱెలో తెలియఁబడవని భాష్యము. దేవదత్తునకు య
జ్ఞదత్తునకును మేఁకలును గొఱ్ఱెలును ధనమనుచుట్టి వాక్యమునందును య
థాసంఖ్యము చెల్లదు కాన సమాసమందు సుతరాం క్రమాన్వయములే
దని కైయటము. ఈయభిప్రాయమునే వివరణకారులు నాగేశపండితులు
ను సమ్మతించుచున్నారు. దేవదత్తయజ్ఞదత్తులు చరస్థిరాస్తులను బంచు
కొనిరియన్నచోట సాహిత్యమువలన సమాసవిశిష్టార్థముతో సమాసవిశి
ష్టార్థము సంబంధించును గాని క్రమాన్వయము లోకమర్యాదననుసరిం
చి కలుగదని గ్రంథకర్తల తాత్పర్యము. కనుకఁ గ్రమాన్వయములేక దే
వదత్తయజ్ఞదత్తు లుభయులును జరస్థిరాస్తులుభయములనుభాగించుకొని
రి యన్నయర్థంబుతోఁచును. అట్లే సీతారాములను భరతశత్రుఘ్నులు
పూజించిరియన్న వాక్యంబునందుఁగూడ సీతారాముల నుభయులను భ
రతశత్రుఘ్ను లుభయులు పూజించిరియన్న యర్థంబగుఁగాని సీతను భ
రతుఁడును రాముని శత్రుఘ్నుఁడుఁబూజించిరియనిక్రమంబు చెల్లనేరదు.
ఈయర్థమె "ఆద్యంతౌటకితౌ" అను సూత్రమునొద్ద శేఖరమందు వ్రా
యఁబడినది. "యద్యప్యత్ర మిళితస్య నైకత్రాన్వయ ఇతిద్వంద్వోపస
ర్జనే౽పి తథాపిసమూహాయో రన్వయబోధోత్తరం యథాసంఖ్య మితి

సూతారంభ సామర్థ్యాత్పునః ప్రత్యేకమన్వయః। లోకేత్వేవం రీత్యా ప్రయోగో సాధు రేవేతిభాష్యేస్పష్టం" కావున బ్రకృతమందును "కోప కామౌ ఏకద్విత్వకరణేహేతూ" అనినచోటను "కోపకామౌ" అనిన ద్వంద్వ ముయొక్క విశిష్టార్థము "ఏకద్వి" అనిన ద్వంద్వముయొక్క విశిష్టార్థము తో నన్వయించును. "ఏకద్వి" అనుదాని విశిష్టార్థము ప్రకరణసందర్భ వశంబున మూఁడు (మహాపాతకములు) గాన సంకలనంబుచేయఁగాఁ గో పకామము లుభయములు గలిసి మూఁడుమహాపాతకములను జేయ హేతువులగుననినయర్థంబగునుగాని కోపమొకదానిని (మహాపాతక మును) కామంబు రెండింటిని (మహాపాతకములను) జేయహేతువులౌనని పక్రమాన్వయంబు రానేరదని శ్లోకకారతాత్పర్యము. దేవదత్తుఁడు నూ ఱుహూప్యంబులును యజ్ఞదత్తుఁడు రెండునూఱులహూప్యంబులును నీయవల సియున్నపుడు, దేవదత్త యజ్ఞదత్తు లుభయులును గలిసి "గగ్గాశ్శతందం ద్యంతాం" అనుచోటునందువలెనె సముదాయ వాక్యపరిసమాప్తిన్యాయం బునమూఁడువందలహూప్యంబుల నీయవలసియుండెనని లోకవ్యవహార ము కలుగును. అచ్చటి ప్రకరణసందర్భవశంబున ధనభాగంబుల న్యూన తాధిక్యంబులు తెలియును. అట్లే ప్రకృతంబునందును గోపకామంబులు మూఁడుమహాపాతకములు సేయుటకు హేతువులనియోఁగూడ, ఉచితత్వ మునుబట్టి కోపము బ్రహ్మవధంబునకును, కామము సువర్ణస్తేయగురు తల్పగమనంబులకును గారణములనియర్థంబుతోఁచును. కాని కోపము ప్రత్యేకముగామూఁడింటికి, కామము ప్రత్యేకముగా మూఁడింటికిని గార ణములుగాలేవు. "శ్లో॥ కామఏష క్రోధఏష। రజోగుణసముద్భవః" అనుగీ తావాక్యమునఁ గామము కోపమనెడి కార్యరూపంబునఁ బరిణమించుటం జేసి "తదనన్యత్వ" న్యాయంబునఁ గోపము రూపాంతరముం బొందినకా మమేకావునఁ గామంబు మూఁడుమహాపాతకంబులకును గారణంబైనను గో పంబారీతినిగానేరదు. కనుకఁ గోపకామములు కార్యాచిత్యము ననుసరిం

చి తాత్పర్యసమన్వయంబు చేసికొనవలయునని తోఁచుచున్నది. పూర్వోక్తకారణంబులచేత "ఏకద్వికరణే హేతూ" అనుచోటను సంకలనార్థంబు చెప్పనందున "త్రియాణాంకరణే హేతూ" అనవలసియుండునని శేఖరకారుతాత్పర్యమైనట్లు స్పష్టమగుచున్నది. ఇట్లుశాస్త్రార్థంబు నాలోచింపఁగా నవాంతసంఖ్యలకు సంకలనార్థంబులేని స్థలంబులందు శంకనొందక నిరంకుశంబుగా ద్వంద్వంబు నివ్వటిల్లునని స్పష్టమగుచున్నది. సాహిత్యరత్నాకరము దోషతరంగము. శ్లో॥ "పాథోవాహపద త్రిసప్తదశదోర్గల్లశ్ఛవే" అనుశ్లోకమునొద్ద "త్రిసప్తదశదోర్గల్ల ఇత్యత్ర వింశతిదోరితి వక్తవ్యే త్రిసప్తదశదో రిత్యపుష్టార్థం॥ ప్రకృతానుపయుక్తార్థ। మపుష్టార్థం తదుచ్యతే ఇతిలక్షణాత్" అని యున్నది. "త్రిసప్తదశదోర్గల్లః" ఈస్థలమందు "ఇరువది" అన్న యర్థమును, మూఁడు, ఏడు, పది, అను మూఁడుసంఖ్యల సంకలనంబుచేసి చూపుట నపుష్టార్థదోషంబునకే యుదాహరణముగా నీఁబడినది. వ్యుత్పత్తిసంస్కారంబునకు నుదాహరింపఁబడలేదు. ఇట, మూఁడు, ఏడు, సంఖ్యలునవాంతసంఖ్యలలోనివి గావున సంకలనంబులో సమాసంబెట్లు గుదురునో సంశయింపవలసి యున్నది. ఇట్టినిషేధము కేవలమును నవాంతసంఖ్యలకే ద్వంద్వము చేయునపుడు చెల్లునుగాని యతీతసంఖ్యాసమభివ్యాహారస్థలంబున నిషేధంబు ప్రవర్తిల్లనేరదని తోఁచుచున్నది. ప్రకృతంబున నవాంతసంఖ్యాతీతమయిన దశసంఖ్యకూడ నున్నందున నట్టినిషేధము చెల్లదని ధ్వన్యంతర్వాణి తాత్పర్యమయినట్లు ధ్వనించును. కాన సంకలనార్థస్థలంబు కానిచోట్లను నవాంతసంఖ్యలకు ద్వంద్వంబుండవచ్చును.

1 ఏకద్విత్రిచతుష్పంచగుణాద్యామాదిషుక్రమాత్. వేదాంతపండితః
పం. భూ.

2 ఏకద్విత్రిచతుష్పాదానియువశేర్ద్వ్యః క్రమాదార్జవె }
3 యాతిస్యాన్స్వకగ్రహాయదిచతుస్త్రిద్వ్యంఘ్రిధిష్ణ్యత్థితా }
శాలామృతము. ౧ బిం ౩ బిం

ములోఁ బ్రమాణపురస్సరముగాఁ గొన్నియుక్తియుక్తములైన యుక్తులను వచించి యీవ్యాసమును వ్రాసినాఁడను. ఈనాయుపన్యాసమ్మున న్యాయాభాసములోఁ జెనేని "తంసంతశ్శ్రోతు మర్హంతి| సదసద్వ్యక్తిహేతవః" అను కాళిదాసవచన న్యాయంబునఁ బండితులు పరామర్శించి పరమార్థప్రదర్శనమందు నాకుమార్గదర్శులగుదురుగాక !!

ఇట్లు విన్నవించు విబుధవిధేయబంధువు.

కేలూరి వేంకటరామశాస్త్రి

28—9—12 ఆర్ట్సుకాలేజి.

ఉభయభాషాధ్యాపకపండితుఁడు.

రాజమహేంద్రవరము.

(ఇయ్యది బందరుపురీవాసులు సర్వదా పండితగోష్ఠీపరాయణ బ్రహ్మశ్రీ జంధ్యాల గౌరీనాథశాస్త్రులవారి కోరికోశంబుపై నేఁబడిన యభిప్రాయము. ఆపత్త్రము తెలుఁగుభాషలో నున్నందున నాంధ్రభాషలోనే యిదియు వ్రాయఁబడినది.)



దర్బారుసభాధ్యక్షుల ప్రేరణంబున రచింపఁబడి చదువఁబడిన

# శ్రీ జార్జిఢిల్లీపట్టాభిషేకముక్తావళి.

## SANSKRIT VERSES.

1 శ్లో. శ్రీరమ్యాకారచిహ్నై రపిమ హిమభృతి య త్రాసుకంపాపగాస్తే
యస్మాద్ధర్మ స్వరూపాత్పరిణమతితరాం భారతక్షోణివృద్ధిః
యంసేవ్యాం సంగిరంతేసుకృతమనుభవజ్ఞానవంతో జనాః శ్రీ
శ్లాఘ్యశ్శ్రీజార్జినామా విభురవ యమితాత్సార్వభౌమావతంసః

శ్లో. అలంకృత్యావాసంజలధిహృదయస్థాంగలమహా
న్నృణా మత్రత్యానాం నయనతిమిరంహంతుముదితః
చిరాదాస్మాకీ నాత్సుకృత పరిపాకాత్సముచితా
జ్జయశ్రీమాన్ జార్జిర్వ్రజతి విదితంఢిల్లినగరం.

3 శ్లో. యఃకీర్త్యా లోకబంధుశ్శ్రితివివరముఖే కర్మసాక్షీతిగీతః
శ్రీహిందూరాజ్యవర్తిప్రకృతిసముదయాధారభూతంయమాహుః
జార్జిశ్రీచక్రవర్తీ కృతసకలమహీపాలనో మిత్రభూతో
మేరీచ్ఛాయాసమేతస్సుగుణమణిగణో వర్ధతా మార్కచంద్రం.

## TELUGU VERSES.

శా. శ్రీలాభోన్నతి మూలభూతకరుణా శ్రీమోమరందోర్మికా
శాలిస్వాంత సరోరుహుంబును జగజ్జాలేంద్ర జాలక్రియా
లాలిత్యాభినయ ప్రదర్శన సముల్లాసుంబునౌ నీశ్వరుం
జాలోకించుత జార్జిభూవరుఁ గుటుంబాఢ్యుగా గృపాదృష్టితోన్.

మ. కనకాద్రింగొని రత్నసానువులెసంగన్ హాళి గావించుమే
దినిదేవింబలెఁ గోహినీయరుమణీదివ్య ప్రభాజాలభూ
షనుతంబౌమకుటంబునన్ మెఱయుమేరీదేవి సౌభాగ్యశా
లినియై మేల్సిరిసంపదల్ చెలులు వోలెన్ గొల్వ వర్ధిల్లెసున్.

6 శా. "నావిష్ణుః పృథివీపతిర్భవతి" యం చార్యుల్ వచింపన్ గుణ
శ్రీవృద్ధిన్ బురుషోత్తముండు నగు జార్జిక్ష్మాతలాధీశుభూ
దేవీసంగ్రహణోత్సవంబు భగవద్గీతోక్తి నారాయణాం
శావాప్తంబగు మార్గశీర్షమున నొప్పారంగ న్యాయఁబగున్.

చ. అవనికి మిత్రుఁ డెవ్వరును నస్తమితింగనఁ గా "నమో నవో
భవతి" యటన్న వేదపరిపాటిని జార్జియుఁ జక్రవర్తన
స్వవిధిని బొంది శూరకరసంగ్రహుఁడై ప్రతి పత్కలాశశాం
కవిధమునం జెలంగ మన కన్నుల నద్దిభజింపఁ గాఁదగున్

శా. శ్రీవిష్ణు ప్రతిబింబమై తనరుజార్జిన్ సర్వ సర్వంసహా
దేవీసంగ్రహణాభిషేకమున ధాత్రీనాథు లేతెంచి సం
సేవం గాంచి సహోదల ప్రతిఫలన్ మిత్రున్ సమీపించురా
జీవంబుల్ బలె లక్ష్మికిన్ నెలవులై చెన్నొందఁ జూడన్ దగున్.

9 మ. పొగకార్మబ్బులు మంటచాల్మెఱవులుం బొంగారు కన్నీటియే
టిగముల్ సల్పిన దాండయాత్రికులధాటీవృష్టులేచన్ మహా
యుగమై తోఁచినదుర్దినాలిబహుదుర్యోగంబు మాయించి బల్
సుగముల్ గూర్చును నాంగిలేయవిజయజ్యోతిశ్శ రచ్చంద్రికల్.

సీ. తనుతొప్పపాటులోఁ గాశికిన్ జనుధూమ
శకటినై పుణి యోగశక్తిగాఁగఁ

సూక్తి బ్రహ్మణ్య సారసాక్షి:

బ్రితివర్కోటార్థమ్ముఁ బ్రత్యక్షమనఁ జాలు
తీఁగవార్తయు దివ్యదృష్టి గాఁగ
గోష్ఠభూమియునవీనగ్యామృతౌషధీ
రసలబ్ధి రత్నగర్భవతిగాఁగ
మహా నిరక్షరకుక్షిమయమునౌ దేశంబుఁ
బల్కునాతికి నాటపట్టుగాఁగ

తే. గీ. నఖిలజనులకు సర్వసౌఖ్యంబు లొసఁగి
సర్వవర్ణంబులందును సామ్యబుద్ధి
నెఱయ సర్వత్ర సర్వదా నేర్పుగల్గి
ప్రబలుచుండెన, నాంగ్లేయపాలనంబు.

12 చ. తహతహపాటు నొందువనితామణులన్ గనఁజాలలేక స్త్రీ
సహగమనంబు మాన్పఁ దగుశాసనముల్ లిఖియించి యెంతయో
యిహపరసాధనంబయినయెక్కుడుబున్నెముఁ గట్టుకొన్న యీ
మహిత గుణాంగిలేయులక్షమాపరిపాలన మేరు మెచ్చరే?

మ. అలవిన్ మీఱినదుండగంబులను మొండౌ దండకారణ్యభూ
ఖలమార్గంబుల ధర్మమూర్తులనఁగా ఘంటాపథశ్రీల్ నిర
ర్గళధాటిన్ జొరఁబెట్టి చోరభయముల్ గాసిల్లఁ గావత్రికం
బిల ధారాళ మొనర్చురాజ్య మిదిగా కేరాజ్యము గంటిమే.

చ. తనసతిజాహ్నవిం జెనయుదారయు స్వీయనురద్రిసంఖ్యానం
దనులు రమాభకస్యయు సుధామయవాక్కును గల్గుజార్జిపా
వనగుణరత్నుఁ జూచి యొరుపచ్చ సహింపక పొగరుంమష్టో
భనిడినఁ గాంచితమ్మ! పతి భారతవర్షవసుంధరామణీ!.

16 ఉ. దూరమునుండి జార్జిగుణధుర్యుఁడు ఖూర్మిని నిన్నుఁ జేరు; మే
లీరమణీమణీక్షణముఁ బ్రేమను వీడకయుండుఁ; దన్మనో
హారిణులై సవిూయిరువురుం దలియుంతర మెంచఁజాలనె
వ్వారలు గొప్పవారో చెపుమ! భారతవర్షవసుంధరామణీ.

శా. ఏకచ్ఛత్రనృపాలభూరమణి! యోహిందూధరిత్రీమణీ!
యోకామ్యార్పణకామధేనుసరణీ! జ్యోతిర్విదుల్ భూమియం
దాకర్షించుసుశక్తిఁగాంచిరట; నీదౌశక్తియో చిత్రమా;
నాకర్షింతువు సింధు వద్దినను నాహా! సార్వభౌమాంకునేఁ

చ. ఖలియుసఁదగ్గ కోటను గమంభ్రమ ఢిల్లియటంచు! మహానుభా
యిలజగదీశ్వరుండలఖలీశ్వరుఁడై తనకూర్మపృష్ఠమం
దెలమి వహించునట్లు వహియించుటఁ జేసి ఖలీశ్వరాఖ్యతోఁ
బిలిచిరి ధర్మజాములను బ్రోవను మాగతి జార్జిభూపతీ!.

18 శా. శ్రీజార్జిధ్రువసార్వభౌమ! కరుణాసింధూ! విధింబాయక
వ్యాజప్రేమఁ బితామహీమణి యొనర్పంజాలె రాజ్యంబు పు
న్నోజశ్శాలియుఁ దండ్రి మిత్రతకు నుద్యోగించి భాసిల్లె. నా
యాజాడన్ ద్విజరాజసంస్ఫురణ దీర్ఘాయుండవై యేలుతన్.

మ. రవి యొందాఁక దివిన్ గ్రహావళిపయిన్ రాజ్యంబుచెల్లించునో
యవదాతాంశుఁడు తారకా దయితుఁడై యానందమున్ జెందునో
ధ్రువుఁడున్ సప్తఋషీంద్రమండలిపయిన్ రూఢస్థితిన్ బొందునో
యవనీదేవత నాంగ్లేయవిభువే యందాఁకఁ బాలించుతన్.

చ. మయుఁడనుపూర్వదేవత సమంచితభక్తిని బ్పార్థసారథి
ప్రియవచనంబు నొంది యొనరించి ధర్మజునన్మణి ప్రభా

# నవరత్న మంగళ మాలిక.

వారాణసీ క్షేత్రంబునకుఁ బ్రతివాదియని విఖ్యాతికెక్కి దక్షిణ దేశంబు నధివసించినయీకోటిలింగ క్షేత్రంబున నొకానొక శివరాత్రి పర్వకాలంబునందు రథారూఢుండగుకోటిలింగేశ్వరుండు తనదు దర్శనంబున నుల్లంబు నుల్లాసంబు నొందించి నన్ను స్వకీయస్తుతి విషయక మనోరథారూఢుం జేయంగ ధూర్జటిజటిల భక్తి భాసుర కవితా వితానశాలి యయ్యుతో నశేషరసజ్ఞచిత్తసుధామధురంబయ్యును నశేషరసజ్ఞాదిసీమ సుధా మధురంబగునట్టులు రచియింపఁబడిన పద్య నవరత్న మంగళ మాలిక :—

శా. శ్రీగోదావరి మాతృదేవతవలెన్ జిత్తాబ్జమూగార్చియా
హా! గంభీర భవద్దయారసముచాయం బొంగి యజ్ఞానని
దాఘ్రాగామి స్నను లేపుచుం దొరల జొర్కాడించి పేరేపనీ
శ్రీకంటంబడికొల్తు రక్షయిడుమీ శ్రీకోటిలింగేశ్వరా.

మ. సకలస్నీకొవరించు ధన్యుఁడు గుడాల్ నాగంబులున్ బల్లకీల్
చతురంభో నిధిమేఖలాఖిలమహీ సామ్రాజ్య మొప్పారను
న్నతుఁడై యీతనుకంచుకం బెసలినంతన్ గిత్తపై నెక్కి సం
చితభిక్షుండయి కొండకాఁపగుబలీ! శ్రీకోటి లింగేశ్వరా.

మ. క్షితిపై గొప్పదటంచు సమ్ముఖగత శ్రీగౌతమీతీరపై
కతివేదిన్ జలజాసనంబున నినున్ జ్ఞానాక్షి వీక్షించిన
ద్గతి చేకొన్నదె జన్మమయ్యె. యిటుఁ దీర్ఘధ్యానముం ద్వద్దయా
స్థితసత్త్వన్ బరమాంనమై పరఁగెడిన్ శ్రీకోటి లింగేశ్వరా.

మ. కొలువై కాశిపురంబు నివ్వటిలసీమం చారు సమ్మర్దనం
కులరావంబు తపో విభూతియనియో కోటానఁ గోటుల్ జగం
బులఁ బ్రోవంగల కోటి లింగముల రూపుల్ దాల్చి నిక్కంబుగుం
దిలపాశ్వాస్నపనంబు చేయుచుంటివా? యిటన్ శ్రీకోటి లింగేశ్వరా.

మ. పరిభాషా విధిశాస్త్రముల్ పదసమన్వయ్యైకవాక్యత్వవై
ఖరితోఁ రంజిలి కార్యకాలమనుపక్షం బందునున్నట్లు ని
ర్భరరాగంబున నల్లుకొన్న తమదాంపత్యంబు ధ్యానించుచుం
డిరిహింజెందుదు నాత్మలోన నవుడుక్ శ్రీకోటి లింగేశ్వరా.

మ. వినునీవే తలిదండ్రిలిద్దఱునుగావే? యర్ధనారీశమూ
ర్తి ని విశ్వంబుసృజించి ప్రోచియునయారే! « నేహనా నాస్తికిం
చన " యన్నట్టి శ్రుతిప్రకారమునసీ జాగ్రల్ల లాటంతపా
క్షినిసర్వంబులయింపసాక్షివిగదా ? శ్రీకోటిలింగేశ్వరా.

శా. భాషానాథుని బుష్పసాయకుఁగాంచన్నీవు పుత్రివ్యథా
ద్వేషంబూనక శౌరినీకుముదమొందింపన్ జగన్మోహినీ
వేషంబొందియుదారతన్ మెలఁగ నీపెంపుంబ్రిభావంబుని
శ్శేషంబౌసాగను న్నుతింపఁదరమా? శ్రీకోటి లింగేశ్వరా.

మ. హరివంశోక్తులు శేషధర్మముల వ్యాఖ్యల్ యోగ వాసిష్ఠవా
ఘ్గరి పాద్మాది పురాణగోష్ఠులు సదా చాటింప దుష్టార్దిత
త్పరశిష్టా భయహస్తదానపర సీతారామ రూపంబుదా
ల్చిరఘూర్వీశ కులంబునన్ వెలసితో? శ్రీకోటి లింగేశ్వరా.

మ. యమిరాజేంద్ర పురాణ దుందుభులుమ్రోయన్ స్వల్పనారాయణా
ర్ధములోఁగూడిన నీపరాంశమగు సీతారామదేవావతా
రము గంగా యమునాంశ సంగమిత తీర్థంబట్లుసీ చెంతఁజే
రిమహోఘుంబులు చెందుచుందును గదా శ్రీకోటి లింగేశ్వరా.

(సశేషము)

ఇట్లు
కోటిలింగక్షేత్ర నివాసి
కల్లూరి వేంకటరామశాస్త్రి.
ఉభయభాషాధ్యాపక పండితుఁడు
ఆర్ట్సుకాలేజి.

